60th Year of Publication వజ్రోత్సవ సంవత్సరం

# జమీన్‌రైతు

ESTD. 1930
Regd No. H. NL.18
సంపుటి 60 సంచిక 46
10.11.1989
నెల్లూరు
శుక్రవారం
20 పేజీలు రూ 1.50

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు * సంపాదకుడు: నెల్లూరు డోలేంద్రప్రసాద్ * మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

## తెలుగు దేశం గుండెల్లో కొండంత దిగులు, గుబులు!

(మా రాజకీయ విలేకరినుండి)

పోలింగురోజు దగ్గరపడేకొద్దీ తెలుగు దేశం అగ్రనాయకులకు దడ పెరుగుతున్నది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి వస్తున్న వార్తలు, ఇంటెలిజెన్స్ నివేదికలు గండిపేట పీఠంలో కొండంతదిగులు పుట్టిస్తున్నాయి. తమ కంచుకోటలకు బీటలువారుతున్నాయని, మంచుకోటలుగా మారిపోతున్నాయని తెలుసుకుని కలత చెందుతున్నారు.

ఎన్నికలకు ఇంకా పన్నెండు దినాల వ్యవధానం వున్నప్పుడుఇప్పుడే, జయాపజయాలపై నిర్ణయానికి రావడం తొందరపాటవుతుంది కాని, రాష్ట్రమంతటి నుంచి వస్తున్న సమాచారం మాత్రం తెలుగుదేశానికి సంతోషకరంగాలేదు. తెలంగాణా కోస్తా జిల్లాలలో ఎన్ టి ఆర్ సభలకు పెద్దగా జనం రావడంలేదన్న వాస్తవం దేశం నాయకులకు జీర్ణం కావడంలేదు. హైదరాబాదు సిటీని అనుకునివున్న [illegible]గింలోకాని, నక్సలైట్ల సమస్య తీవ్రంగా వున్న కరీంనగర్, నిజామాబాద్ జిల్లాలలో కాని ఎన్టీఆర్ కు పూర్వపు ఆదరణ లభించలేదు. ఇమ్మంటి చోట్ల జనం వచ్చినా, ఆయన ప్రసంగానికి ఎవ్వరూ ఉత్తేజితులైనట్లు కన్పించలేదు. ఈ పరిస్థితి గ్రహించే, ఎన్ టి రామారావు చంద్రబాబునాయుడు, ఉపేంద్రలను గండిపేటలో కూలేసి మునిగిపోతున్న పడవకు ఎక్కడ చిల్లులున్నాయో వెతికి పూడ్చే పని అప్పచెప్పారు.

**జనం రాలేదనే చింత- ఏమౌతుందోననే శంక**

జిల్లాలో పార్టీ బలహీనంగా వుందనుకున్న నియోజకవర్గాలను గుర్తించి, వాటి పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపడం, స్పెషల్ క్యాష్ పార్శిళ్ళు పంపడం వీరి డ్యూటీ! అవసరమనుకున్నచోట్ల అసమ్మతితోనో, అలకతోనో వున్న స్థానిక నాయకులను బుజ్జగించే ప్రయత్నాలూ కొనసాగుతున్నాయి.

1983, 1985 ఎన్నికలనాటి ఎన్టీఆర్ ప్రభంజనం ఈనాడు అదృశ్యమైపోయిందనే నిజాన్ని తెలుసుకోవడంతో, జిల్లా స్థాయి

—కొరవ 8వ పేజీలో

## గడగడ వణికించి, గాభరా పుట్టించి, చల్లగా జారుకున్నది తుఫాన్!

ప్రకృతి నెల్లూరుజిల్లాపై ఎందుకో పగబట్టివుంది; ప్రతీకారం తీర్చుకోను తపన పడుతున్నది; ఆ క్రోధం, ఆక్రోశం అంతింతనికాదు; ఒకనాటితో, ఒక ఏటితో తీరేవిగానూ లేవు! దెబ్బమీద దెబ్బగా, రావుదెబ్బలు కొడ్తూనే వుంది; విలయం సృష్టించి వినోదిస్తున్నది; ప్రళయం కల్పించి పకపకలాడుతున్నది; పిచ్చిపట్టినట్లు ప్రవర్తిస్తున్నది.

లేకుంటే ఎక్కడి థాయిలాండ్? ఎక్కడి తుమ్మలపెంట? ప్రపంచంలో నెల్లూరు మినహా మరేచోటు కన్పించలేదా? సంధించి విడిచిపెట్టిన బాణంలా, గురిచూసి విడిచిన బాంబులాగా ప్రచండ వేగంతో, ప్రళయ ఝంఝామారుతంతో, పైశాచిక బలంతో నెల్లూరు తీరాన్ని తుఫాను తాకొన్నదంటే మన జిల్లాపట్ల ప్రకృతి పగబట్టలేదని భావించగలమా? ఎవరుపెట్టిన శాపమో, ఏ జన్మలో చేసిన పాపమో ఈ రీతిగా పరిణమించిందని అనుకోకుండా వుండగలమా?

**20 చావులు- కావలి టౌన్ తీన్తారైపోయింది!**

8 వ తేది రాత్రి ఆకాశవాణి హెచ్చరిక నుంచి 9 వ తేది అర్ధరాత్రి తుఫాను తీరం దాటిందన్నవార్త వెలువడినదాకా నెల్లూరు జిల్లా మొత్తం భయంతో గడగడ వణికింది;

—కొరవ 8వ పేజీలో

# చేయవచ్చు స్వర్గంగా - చీల్చవచ్చు నరకంగా!
# ఏంచేస్తారో మీ ఇష్టం-ఏమిచేసినా ఇదే సమయం!



ఇందిరమ్మ ఆశయాలపై నమ్మకంతో
రాజీవుని నాయకత్వంపై గురుత్వంతో
ఎన్ని అవాంతరాలెదురైనా, అన్నిపదవులూ పీకేసినా
నమ్మిన పార్టీని వదలని నిజాయితీపరుడు.
పేదలకు ఎన్నడూ దూరంకాని నాయకుడు
అలమటించే లోకానికి అండగా నిలిచేవాడు

## శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి

అసలే అభివృద్ధికి నోచుకోని అనాథ
మన వెంకటగిరి నియోజకవర్గం!
జనార్ధనరెడ్డిని గెల్పించి దీన్ని
జనంతో నిర్మించే స్వర్గంగా మలచుకుందామా?
ప్రజల నోళ్ళుకొట్టి, ప్రజాస్వామ్యాన్ని పాతిపెట్టే
పార్టీలకు కైకొట్టి మన బ్రతుకులను
నరకంగా మలచుకుందామా?

## మీరే ఆలోచించండి!



కల్లబొల్లి మాటలకు, కడిబెడు మొసలి కన్నీళ్ళకు
పట్టొట్టి వాగ్దానాలకు, వంచించే అనర్థాలకు
మరొకసారి బోల్తాపడ్డామా.

## కన్నుపొడుచుకున్నా మనకు కన్పించదు భవిష్యత్తు

ఎన్నికలనాడొచ్చి, ఏమేమోచెప్పి
అరచేతిలో స్వర్గం చూపించి, మనకళ్ళు రెండూకప్పి
ఆ తర్వాత ముఖంచాటేసే పెద్దమనుషులను నమ్మామా.

## మన నియోజకవర్గం గతి, అధోగతే!

పదవులిస్తామంటే పాదాభివందనాలు చేసి
పదవిపీకేస్తే బోడిపార్టీలని నిందలువేసి
పదవులకోసం తోడబుట్టినవారినే నట్టేటముంచి
పదవులు పోయేట్లుంటే ఊళ్ళకు ఊళ్ళే తగులబెట్టే
కుహనా నాయకుల వలలో చిక్కామా.

## మన గ్రామాల్లో శాంతికిక తిలోదకాలే!



వెంకటగిరి శాసనసభా నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థి

## నేదురుమల్లి జనార్ధనరెడ్డి

తిరుపతి లోక్‌సభ నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థి

## డా॥ చింతా మోహన్

లకు అఖండవిజయం చేకూర్చాలని
మా వినయపూర్వక విన్నపం

-వెంకటగిరి మండల కాంగ్రెస్ కమిటీ





నిరంతర ప్రజాసేవకుడు, ఒకేమాటకు, ఒకేపార్టీకి అంకితమైనవ్యక్తి,
సామాన్యునితో మిత్రత్వం – పేదలతో సన్నిహితత్వం-అదే

# కె. వి. సుబ్బారెడ్డి

## లక్ష్యం

పార్టీలోని అంతర్గత శత్రువుల నెదిరిస్తున్న అభ్యర్థి,
తెలుగుదేశ దుష్టపాలనను ఖండిస్తున్న అభ్యర్థి
అధిష్టానవర్గం నిర్ణయించిన

స్వచ్ఛమైన - అచ్ఛమైన కాంగ్రెస్ అభ్యర్థి

## సుబ్బారెడ్డి - సుబ్బారెడ్డి - సుబ్బారెడ్డి

## హస్తం గుర్తుపై

మీ ఓటు ముద్రవేసి గెలిపించండి



పోలింగ్ తేది
**22-11-89**

Space Donated : N. Venkatapathi Naidu G. T. Road - Nellore.

---

## ఆత్మకూరు నియోజకవర్గానికి

జాతీయ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా నిర్ణయింపబడిన

# డా॥ బి. సుందరరామ రెడ్డి



మన నియోజకవర్గ ప్రజలకు అత్యంత సన్నిహితుడు, మనలో ఒకడు,
వెనుకబడివుండిన మన నియోజకవర్గమునకు
అభివృద్ధి సాధించిన వ్యక్తి, మనలో ప్రతిఒక్కరికి సాయపడడంకోసం
నిర్విరామంగా శ్రమిస్తున్న నిస్వార్థపరుడు

## డాక్టర్ బి. సుందరరామరెడ్డిగారికి

## హస్తం గుర్తుపై



మన పవిత్రమైన ఓటువేసి గెలిపించి మన నియోజకవర్గానికి
నిజమైన ప్రతినిధిని ఎన్నుకుందాం.

—ఆత్మకూరు నియోజకవర్గం ఓటర్లు.

# నెల్లూరులో పోటీ జెకె, రమేష్‌ల మధ్యనే!

## పినాకిని తీరం

### జె. కె. 'తిరుగుబాటు'

నెల్లూరు నియోజకవర్గంలో కాంగ్రెస్ వాదులు తాము ఆరాధ్యదైవంగా భావించే శ్రీమతి ఇందిరాగాంధీ ''ఆత్మప్రబోధ'' మంత్రోపదేశాన్ని ప్రయోగించేస్తున్నారు. ఎన్నికల పోలింగు [illegible] నెల్లూరులో అడుగుపెట్టిన నేను. జె. కె. రెడ్డి ప్రచార హోరులోని ఒక యువకుణ్ణి ప్రశ్నిస్తే తడుముకోకుండా ఠకీమని సమాధానాన్ని నా మొహాన విసిరికొట్టాడు. కాంగ్రెస్‌వాదులు దేవతగా, సామ్రాజ్ఞిగా పూజించే ప్రధాని ఇందిరాగాంధీయే అంతరాత్మ ప్రబోధపు బాణంతో రాష్ట్రపతిత్వానికి అధికార కాంగ్రెస్ అభ్యర్థికి వ్యతిరేకంగా బహిరంగంగా పనిచేసి విజయాన్ని సాధించింది. ఆ పని చేసిన ఇందిరాగాంధీ కాంగ్రెసివాది కాకుండా పోయిందా. జె కె. రెడ్డిగారిని, మేంగాని కాకుండా పోవడానికి. అని ఆ అబ్బాయి సూటిగా సమాధానం చెప్పాడు. నోరు మూసుకోవలసి వచ్చింది!

పొరపాటును సరిదిద్దుకోవడం ధీమంతుల లక్షణం అనేది ''ఆత్మ ప్రబోధం'' అంతరార్థం దాన్ని తప్పు పట్టగలమా? ఒక్క జె. కె. రెడ్డి విషయంలో తప్ప, ఈసారి జిల్లాలో కాంగ్రెస్ అభ్యర్థుల సెలక్షన్ సముచితంగా వుందని అందరూ అభిప్రాయపడ్డారు. ఈ అపశ్రుతికూడా లేకుంటే ఫలితాలు కాంగ్రెస్‌కు అనుకూలంగా, అద్భుతంగా వుండేవని కాంగ్రెస్‌వాదులు అభిప్రాయపడుతున్నారు. ఈ ఎన్నికలో జె. కె. రెడ్డి కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి నోచుకోలేకపోవడం అన్యాయమే; ఆయన కాంగ్రెస్ తిరుగుబాటు అభ్యర్థిగా పోటీ చేయవలసిరావడం దురదృష్టకరమే; ఆయన కాంగ్రెస్‌నుంచి గెంటబడడం విచారకరమే. ఈ పరిణామాన్ని మనోవికారంగా భావించడానికి, వ్యాఖ్యానించడానికి అభ్యంతరమే లేదు. జె. కె. కాంగ్రెసువాడు కాకుంటే నెల్లూరులో మరెవడు కాంగ్రెసువాడు? జె. కె.కి కాంగ్రెస్ అభ్యర్థిత్వం వచ్చి వుంటే అది మామూలు విషయంగానే వుండేది; ఆయన అభ్యర్థిత్వం పట్ల ప్రజల వైఖరి మామూలుగానే వుండేది. అట్లా జరగలేదు కాబట్టే ఈనాడు టిక్కెట్టులో అసాధారణమైన రీతిలో అన్నివర్గాలలో సానుభూతి అపారంగా వ్యక్తమవుతున్నది.

అరణ్యవాసంలో వున్న గత ఐదారేళ్ళలో జిల్లాలో కాంగ్రెస్‌ను ఆదుకొని, అన్ని విషయాలలో ముందుంటున్నవాడు జె. కె. ఆయనవంటి కాంట్రాక్టర్లెందరో [illegible] అధికార పదవులను పైసలను సంపాయించుకోగా, ఆ అవకాశవాదానికి బానిసకాకుండా, అచంచలంగా విశ్వాసపాత్రంగా కష్టకాలంలో కాంగ్రెస్‌ను కనిపెట్టుకొని వున్నవాడు జె. కె. ఒక నాయకుడుగా కాకుండా, కార్యకర్తగా కాంగ్రెస్ చేపట్టిన ప్రతి కార్యక్రమంలో ముందునిలిచినవాడు జె కె ఉప్పుసత్యాగ్రహ పునః ప్రదర్శనలో త్రివర్ణపతాకం చేతబట్టుకుని నెల్లూరు నుండి మైపాడు సముద్రతీరం వరకు పద

—కొరవ 10వ పేజీలో

తెలుగుదేశం పట్ల ప్రజలలో వున్న తీవ్ర అసంతృప్తి ఎన్ టి ఆర్ పర్యటనలోనే వెల్లడైపోయింది. మూటముల్లె కట్టుకొని వచ్చి, రాత్రి పగలు తేడా లేకుండా గంటలు పర్యంతం ఆయన ఈ దర్శనార్థం పడిగాపులు పడిన జనంపోయి, చైతన్య రథం రోడ్లో పోతుంటే మామూలు లారీయో బస్సో పోతున్నంత నిరాసక్తంగా చూచి, వెళ్ళిపోయే జనమే ఎక్కువగా కన్పిస్తున్నారు. తెలుగుదేశంపట్ల ప్రజలలో అభిమానం క్షీణించిందని చెప్పడానికి ఇంతకంటే నిదర్శనం అవసరంలేదు.

కాంగ్రెస్ పరిస్థితి అట్లారాదు. ఆపార్టీ పట్ల అభిమానం ఏర్పడకపోయినా, ఇదివరకటి తిరస్కారభావం, ధిక్కారం ఇప్పుడులేవు. అభ్యర్థి మెరుగైనవాడైతే కాంగ్రెస్‌కు ఓటువేయడానికి వెనుకాడే పరిస్థితిలేదు. ఇప్పుడున్న దుస్థితిలో ఇదే పెద్ద వరమనుకోవాలి!

ఇక నియోజకవర్గాలవారీగా చూస్తే, ప్రతిరోజుకూ పరిస్థితి మారిపోతున్నది. గెలిచేవారెవరో తేల్చిచెప్పడానికి ఇంకా వ్యవధివుంది కాబట్టి, ఆయాచోట్ల వున్న వాస్తవాన్ని మాత్రం పాఠకుల ముందు పెడుతున్నాం. ఊహాగానాలు మీ ఇష్టం.

### నెల్లూరులో పోటీ జె కె, రమేష్‌ల మధ్యనే!

ఈమాట అనడం సాహసమే కావచ్చు. కాని ఎంతో ఆలోచించి, ఎన్ని కోణాలనుంచో పరిశీలించి, ఎందరెందరినుంచి అభిప్రాయ సేకరణచేసి చెపుతున్న మాట ఇది. కాంగ్రెసు అభ్యర్థి శ్రీ కె వి సుబ్బారెడ్డి గారికి కోపం రావచ్చు; కష్టం కలగవచ్చు. కాని, వాస్తవ పరిస్థితి అదే! కాంగ్రెసు వాదులలో ఆయన పేరు రాగానే టౌనులో సర్వత్రా విన్పించిన మాట. ఓడిపోతాడని; ఇప్పటికీ అదేమాట రాజ్యం చేస్తున్నది. కొన్ని ప్రాంతాలలో ఆయనకు ఈ పరిస్థితి ప్రత్యక్షంగాకూడా అనుభవంలోకి వచ్చిందని తెలుస్తున్నది. రెండు సార్లు ఒకే నియోజకవర్గంనుంచి ఎన్నికైన ఏ నాయకుడికైనా ఇది సహజమే! పదవి కాలంలో పని చేయించుకున్నవారు మర్చిపోతారు, చేయలేకపోయినవారు గుర్తు పెట్టుకుంటారు! రానున్న 10 రోజులలో

> **ఎన్నికల చిత్రం**
> (8వ పేజీకొరవ)

ఏదైనా విచిత్రం జరిగితే తప్ప, సుబ్బారెడ్డిగారినిచూసి మనం జాలిపడాల్సిందే!

కాంగ్రెస్ తిరుగుబాటుఅభ్యర్థి అయినా, ఓటర్లలో కాంగ్రెస్ అభ్యర్థిగానే గుర్తింపు పొందుతున్నాడు. జె కె. పదేళ్ళుగా ఏపదవి లేకపోయినా కాంగ్రెస్‌తో, కాంగ్రెస్ కార్యకర్తలతో పెంచుకున్న అనుబంధం ఆయనకీవిధంగా ఉపయోగపడుతున్నది. ఓట్లేస్తారో, వేయరో తెలియదుగాని, ప్రచారానికి ఎక్కడికిపోయినా, జెకెకు బ్రహ్మరథం పడుతున్నారు; హారతులిస్తున్నారు; పూలు చల్లుతున్నారు; టెంకాయలు కొడుతున్నారు. నెల్లూరుటౌనులో జె కె ఇప్పుడొక గ్లామర్ స్టార్. పేద ప్రజలలోనే కాకుండా, కాంగ్రెస్ అభిమానులైన ప్రజల [illegible] కూడా జె కె పేరు విన్పిస్తున్నది. చదువురాని రిక్షా కార్మికులు సైతం కాంగ్రెస్ అభ్యర్థి ఎవరని అడిగితే జె కె అంటున్నారు; [illegible] కాంగ్రెస్ ఓట్లన్నీ ఆయనకే పడే అవకాశం వుంది.

రమేష్‌రెడ్డికి మునిసిపల్ ఛైర్మన్‌గా పదవి పెద్ద అసెట్. ఈ పట్టణంలో రోడ్లు, డ్రైన్లు వేసి [illegible] చేయడంతో ఆయనపట్ల అభిమానం వ్యక్తమౌతున్నది. బాలాజీనగర్‌లో ఆయన [illegible] తెలుగుదేశం ఓట్లలో చీలికలేదు. ఆనం వారితోసహా అందరూ ఏకోన్ముఖంగా పనిచేస్తున్నారు. రమేష్‌రెడ్డి ప్రచారమే సరిగాలేదు. మంత్రి అవుతాడని చెపుతున్న మాటలు ఓటర్లకు అహంకారంగా ధ్వనిస్తున్నాయి; కొందరుకార్యకర్తలనూ పోగొట్టుకుంటున్నారని వినికిడి

మొత్తంమీద పోటీ ఈ ఇద్దరిమధ్యనే! జె కె రెడ్డి కేవలం కాంగ్రెస్ ఓట్లను మాత్రమే చీలిస్తే.రమేష్ రెడ్డికి అనుకూలం; తెలుగుదేశానికి చిల్లుపెట్టగల్గితే గెలుపు అనుమానం. ఏ పార్టీతోనూ అనుబంధం లేని మామూలుఓటర్లు ఎవవైపు ఆకర్షితులైతే, వారిదే విజయం.

### సర్వేపల్లిలో ఇద్దరూ 'సన్యాసి' అభ్యర్థులే!

సన్యాసులంటే ఎగతాళి చేయడంకాదు. [illegible] తిరుగుతున్నారని అర్థం. సర్వేపల్లి గ్రామాలకు వెళ్తే అసలు ఎన్నిక జరుగుతున్నట్లేలేదు. గోడలమీద పేర్లలేవు; మైకుల్లో గోలలేదు; జెండాలు, బ్యానర్లు

—కొరవ 8వ పేజీలో

## నెల్లూరు గుసగుసలు
విచారణకుడు

### గవర్నర్

రాష్ట్రగవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషి 11 తేది మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు వస్తున్నారు. ఉదయం 8 గంటలకు కావలికివెళ్ళి, తుఫాను బాధిత గురైన ప్రాంతాలు పర్యటిస్తారు. మధ్యాహ్నం తిరిగి నెల్లూరువచ్చి, సాయంత్రం హైదరాబాదు వెళ్ళిపోతారు.

### కావలి ఎన్నిక జరుగుతుంది

తుఫాను కారణంగా కావలి శాసనసభా నియోజకవర్గం ఎన్నికను వాయిదావేసే పరిస్థితి లేదని, 22 తేది యథాతథంగా జరిగిపోతుందని తెలుస్తున్నది.

### అయ్యప్పస్వామికి కోటితులసిపూజ

చర్లాపల్లి అయ్యప్పస్వామి దేవాలయంలో 16 నుంచి 27 తేది వరకు కోటి తులసీపూజ నిర్వహించబోతున్నారు. 50 మంది వేదపండితులు పాల్గొంట రట.

పతిలక్షల రూపాయల బడ్జెట్‌తో, బ్రహ్మాండంగా జరుగుతున్నాయి ఏర్పాట్లు. అయ్యప్ప భక్తులకు ఇదొక మహదవకాశం.

### లయన్స్ పరుగు

నెహ్రూ శతజయంత్యుత్సవం సందర్భంగా 14 తేది ఉదయం నెల్లూరులో లయన్స్ క్లబ్‌వారు 'నెహ్రూ సెంటినరీ రన్' నిర్వహిస్తున్నారు. పోలీసు పెరేడ్ గ్రౌండ్‌నుంచి 5 కిలోమీటర్ల దూరం వుంటుంది ఈ పరుగుల కార్యక్రమం. ఆరంభిస్తారు. ఆహ్వానిస్తున్నారు. - సెంటినరీ రన్ కమిటీ అధ్యక్షుడు శ్రీ కె. చిత్తరంజన్‌దాస్.

### ఎంటీరిట్యాక్స్‌కు గుడ్డలంగళ్ల బంద్

వస్త్ర వ్యాపారంపై ఎంటీరిట్యాక్స్ విధించినందుకు నిరసనగా 8 తేది నెల్లూరు జిల్లాలోని గుడ్డలంగళ్ళన్నీ మూసి బంద్ పాటించారు. ఈ పన్ను ప్రవేశపెట్టినప్పటినుంచి అధికారుల వేధింపులు పెరిగిపోయాయని, ప్రభుత్వానికి పెద్దగా ఆదాయంలేని ఈ పన్నును రద్దు చేయాలని నెల్లూరు క్లాత్‌మర్చంట్స్ అసోసియేషన్ ఉపాధ్యక్షుడు శ్రీ అన్నమూరి కోటేశ్వరరావు కోరుతున్నారు.

### చవకగా కోడిమాంసం

నెల్లూరు టౌనులో కిలో 26 రూపాయల లెక్కన బ్రాయిలర్ కోడిమాంసం అమ్ముతున్న పౌల్ట్రీ మార్కెటింగ్ సెంటర్ కౌంటర్లు తెరుస్తున్నారు. టౌనులో ఇప్పుడు కోడిమాంసం ధర 32 రూపాయలు పలుకుతోంది. కౌంటర్‌లోనే కాకుండా, 7088 కి ఫోనుచేస్తే విందులు, పార్టీలకుకూడా సరఫరా చేస్తామని డాక్టర్ కృష్ణారెడ్డిగారు చెప్తున్నారు. మాంసం ప్రియులకు భలే మంచి ఛాన్సు.

### వివేకానందరెడ్డికి బ్యాంకు పదవి

నెల్లూరు జిల్లా కో ఆపరేటివ్ బ్యాంకు పర్సన్ ఇన్‌చార్జిగా శ్రీ ఆనం వివేకానందరెడ్డిని నియమించారు. ఎన్టీ ఆర్ నెల్లూరు పర్యటనలో ఈనిర్ణయం తీసుకుని అప్పటికప్పుడు రిజిస్ట్రార్ నుంచి టెలిగ్రాఫిక్ ఆర్డర్లు ఇప్పించారట. ఏదో ఒక పదవికోసం వివేకానందరెడ్డి ఏడేళ్ళుగా చేస్తున్నం తపస్సు ఈనాటికి ఫలించింది.

అరవకుండా వివేకానందరెడ్డి నోరు మూయించడానికి అందించిన మాంసం ముక్క- ఈ అధ్యక్షపదవి అనను సంతృప్తి పరచకుంటే తరాలా చూపిస్తానని బెదిరించి మరీ తెచ్చుకున్నట్లున్నారు. యముడికి శిష్యుడికి లొంగేదిలేదని ప్రగల్భాలు పల్కే నందమూరి తారకరాములవారినికూడా భయపెట్టారనుకోవాలి. ఆనం సోదరులు.

వివేకానందరెడ్డికి పదవితోపాటు, కోవూరులో పాపిరెడ్డి గెలుపు బాధ్యతను కూడా అప్పచెప్పారట అన్నగారు. ఆయన రాపూరు వదలి కోవూరును దున్నేస్తున్నారు. నెల్లూరు సీటులో కూడా తల దూర్చ పడడానికి ఇక అవకాశంలేదు. ఇంతాచేసి ఈ పదవిలోగం ఏడాదిన్నర కూడా వుండదు. ఈ స్వల్పవ్యవధిలోనూ సహకార కోర్టుకేసులుపరిష్కరించుకోవాలి.

తెలుగుదేశం పార్టీకి వివేకానందరెడ్డి చేసిన సేవలకిది ఇదేమంత పెద్దగుర్తింపు కాదు అసలు లేనిదానికంటే ఇదైనా ఏదో నయమని సర్దుకుపోవాల్సిందే!

### మరణం

జిల్లాకు విద్యాదాత, గ్రామాభివృద్ధికి ఎంతగానో కష్టపడిన - పెద్దమనిషి శ్రీ మహదాసు రామనాథంశెట్టి 4 తేదీ గూడూరులో మరణించారు. ఆయన వయస్సు 83 సంవత్సరాలు; నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

రామనాథంశెట్టిగారి సేవకు, జిల్లాకు లిఫ్ట్ ఇర్రిగేషన్ పథకం శాశ్వత చిహ్నంగా మిగిలిపోతుంది.

# వెంకటగిరి ఓటర్లు, చేసిన తప్పే తిరిగిచేసే వివేక హీనులు కారు!

మెజీషియన్ శ్రీ నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డితో పోటీ అంటే- ఆషామాషీ వ్యవహారం కాదు! అయినా శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఆనాటి ఓటమి కోల్పోయినవారు లేరు. పరాజితులు నిరాశపడలేదు. చంద్రశేఖరరెడ్డి కంటే జాగ్రత్తగా ఆచి తూచి అడుగులు వేస్తున్నారు.

గతపర్యాయానికి, ఇప్పటికి ప్రచారం తీరులో, ప్రజల స్పందనలో తేడాస్పష్టంగా కనిపిస్తున్నది. ఇదివరకటి కార్లు, జీపులు, వందిమాగధ బృందాలు, అనవసర ఆర్భాటాలు, వెగటుకల్గించే విందులు, వినోదాలు లేవు. నిరాడంబరంగా, నింపాదిగా గ్రామగ్రామానికివెళ్ళి, అందరినీ కలిసి, ఓపికగా ఓట్లడుగుతున్నారు.

జనార్ధనరెడ్డి పట్ల గ్రామాలలో అనూహ్య ఆదరణ, అభిమానం వ్యక్తమౌతున్నాయి. కొన్ని గ్రామాలలో ప్రజలు స్వచ్ఛందంగా ఆయనకు హారతులిచ్చి, రక్షతిలకాలుదిద్ది జేజేలు కొడుతున్నారు; బ్రహ్మరథం పడుతున్నారు. వదిమందితో గ్రామంలో ఓట్లడిగి ప్రారంభిస్తే- పల్లెల్లో

ఎన్నికల చిత్రం
(8వ పేజీ తరువాత)

అదొక ప్రజాప్రదర్శనగామారిపోతున్నది టౌనులోనూ ఆశ్చర్యంగొల్పే అభిమానం వ్యక్తమౌతున్నది. జనార్ధనరెడ్డి అయితే తమ నియోజకవర్గాన్ని భూతలస్వర్గం చేయగలడన్న భావంతో వున్నారుఓటర్లు ఒకసారి ఓడి రామన్న సామెతాలి, కాంగ్రెసును వదలకుండా నిరంతరంగా నిలబడిన నిజాయితీ, వాగ్దానభంగంలేని పెద్దమనిషి తరహా జనార్ధనరెడ్డి ప్రచారరథాన్ని పల్లెలమీద ఆధిక్యతలో నడిపిస్తున్నాయి.

నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి ఈసారి ఒంటరివాడైపోయాడు. 1988 లో పరిజనార్దనరెడ్డిపై ఆక్రోశంతో ప్రత్యర్థిని పుల్లించేవారు లేరు. గమ్ముగా వుండలేని పార్టీ నేత బయటవెళ్ళిపోయారు; ఒకసారిగెల్చి ఆయన చేసిందేమీలేదన్న నిరసన ఎదురౌతుం టున్నారు. జనంలో సానుభూతిలేదు. కేవలం ఆర్బాటాలతో, మాయలతో ఓటర్లను ప్రలోభపెట్టాలి. అదిఅసాధ్యమని అందరి అభిప్రాయం. ఆయనఆటలు చెల్లేట్లులేవు, పాపం.

వెంకటగిరి ఓటర్లు చేసినతప్పే మళ్ళీ చేసేంత వివేకహీనులుకారని చెప్తున్నారు. ఫలితం ఇప్పుడే చెప్పవచ్చునని, నవ్వేన్నలో పెడితేనే మజాకదా!

ఇదీ స్థూలంగా 11 నియోజకవర్గాల తోని వాస్తవ పరిస్థితి. ★

## పార్లమెంటు సీటు

అసెంబ్లీకి, పార్లమెంట్‌కు ఒకేసారి ఎన్నికలు జరుగుతుండడంతో, లోక్‌సభ అభ్యర్థులను పట్టించుకునేవారే కరువయ్యారు ఒక్క ఒంగోలులో రాజమోహనరెడ్డిగారికి మాత్రం విలువపదలుతున్నది కాని; తిరుపతి, నెల్లూరు అభ్యర్థులిద్దరూ ఏదైవాదిమొగుడొస్తే నామొగుడూ వస్తాడన్నట్లు నిమ్మళంగావున్నారు. కాజీ ఖర్చు లేదు. తిరిగే శ్రమ లేదు. అలసట, ఆయాసం లేవు.

పార్లమెంటు ఫలితాలుకూడా అసెంబ్లీ అభ్యర్థులననుసరించే వుంటాయి సాధారణంగా శాసనసభకు ఏపార్టీకి ఓటేస్తారో, లోక్‌సభకూ అదేగుర్తుపై గుద్దుతారు. దీనికొక ఓటు దానికొక ఓటు వేయడం అరుదుగాగాని జరగదు.

ఒంగోలు పార్లమెంటుకు సంబంధించి రాజమోహనరెడ్డిగారి పేరే వినవస్తున్నది. కావలి, ఉదయగిరి, కనిగిరి నియోజకవర్గాలతో కాంగ్రెసుకువచ్చే లీడ్‌తోనే ఆయన గెలుస్తారని చెప్తున్నారు. శ్రీ కాటూరి నారాయణస్వామి వ్యక్తిగా మంచిపేరున్నవాడేగాని, ఇంత తీవ్రమైన ఎన్నికల పోటీకి ఆయన చాలడంలేదు

నెల్లూరులో పుచ్చలపల్లి పెంచలయ్యకు గెలుపు అవకాశం వుంది అల్లూరు, ఆత్మకూరు, గూడూరులలో కాంగ్రెస్‌కు మంచి ఆధిక్యత వస్తుందని; కోవూరు, రాపూరు, సర్వేపల్లి, నెల్లూరులలో చెరిసమానమైనా గెలుస్తారని అంచనా! తిరుపతి చింతామోహన్ విజయం అనుమానమే! సూళ్లూరుపేటలో పసల పెంచలయ్య చీల్చే ఓట్లపై ఆయన భవితవ్యం ఆధారపడి వుంటుంది

### నీటిమట్టం

| | |
|---|---|
| సోమశిల రిజర్వాయరు | 21.65 టి ఎం.సి. |
| ,, క్రిందకు విడుదల | 8125 క్యూ. |
| కనిగిరి రిజర్వాయరు | 16 . 80 అ. |

-వార్త 8వ పేజీలో

# రాపూరును రతనాల సీమ చేసుకుందాం-
# రామనారాయణరెడ్డిని గెలిపించుకుందాం!



తెలుగునేలపై అవినీతి రాజకీయాన్ని ప్రక్షాళనం చేసిన మహానాయకుడు

## నందమూరి తారకరామారావు

ఆశీర్వాదంతో రాపూరు శాసనసభా నియోజకవర్గం తెలుగుదేశం అభ్యర్థిగా

## ఆనం రామనారాయణరెడ్డి

పోటీచేస్తున్నాడు. జిల్లారాజకీయాకాశంలో ధృవతారగా వెలుగొందుతున్న
ఆ యువకునికి రాపూరుకు సేవచేసే భాగ్యం మరొకసారి కల్పించమని ప్రార్థిస్తున్నాము.







## రామరాజ్యం కావాలంటే రామారావుకు జయంపల్కండి-
## రాపూరు అభివృద్ధి కోరితే రామనారాయణకు విజయం కల్గించండి!

-రాపూరు తెలుగుదేశం కమిటి

( Space Donated )


బెజవాడ పాపిరెడ్డి
కోవూరు నియోజకవర్గం




డాక్టర్ యం. నాగభూషణమ్మ
నెల్లూరు పార్లమెంటరీ నియోజకవర్గం




ఆనం రామనారాయణరెడ్డి
రాపూరు నియోజకవర్గం


టి. రమేష్ రెడ్డి
నెల్లూరు నియోజకవర్గం

# 'తెలుగుదేశం'కే మీ ఓటు

ఆరుకోట్ల ఆంధ్రుల అభిమాన ముఖ్యమంత్రి

## ఎన్. టి. రామారావుగారి

7 సంవత్సరముల పరిపాలనలో—

బడుగువర్గాల సంక్షేమానికి శ్రమిస్తూ, రైతన్నలకు వడ్డీమాఫీ, పేదప్రజానీకానికి అతితక్కువ ధరలో జనతా వస్త్రాలు, తినేందుకు రూ. 2/- లకే కిలోబియ్యం, హరిజన, గిరిజన వెనుకబడిన విద్యార్థులకు హాస్టల్ వసతులు, ప్రజారోగ్యంకొరకు ఎన్నో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు... ఇంకా ఎన్నెన్నో కార్యక్రమాలు చేపట్టి, అవినీతి, లంచగొండితనం అరికట్టేందుకు రాష్ట్రాన్ని ఇంకా ఎంతో అభివృద్ధిచేయ తెలుగుదేశం పార్టీ తలపెట్టింది. అందుకే మీ చేయూత నర్థిస్తోంది. ఈఎన్నికలలో ప్రతి ఒక్కరూ తెలుగుదేశం పార్టీకి మీ పవిత్రమైన ఓటు వేసి అఖండ విజయాన్ని చేకూర్చవలసిందిగా ప్రార్థిస్తున్నాను


నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి
వెంకటగిరి నియోజకవర్గం


పూండ్ల దశరథరామిరెడ్డి
సర్వేపల్లి నియోజకవర్గం


పాతకపల్లి వెంగళరావు
కావలి నియోజకవర్గం


పత్తి ప్రకాశం
సూళ్ళూరుపేట నియోజకవర్గం


కంభంపాటి విజయరామిరెడ్డి
ఉదయగిరి నియోజకవర్గం


రావి మోహన్ చౌదరి
మాజీ కార్యదర్శి
నెల్లూరుజిల్లా తెలుగుదేశం పార్టీ


బల్లి దుర్గాప్రసాదరావు
గూడూరు నియోజకవర్గం

**పోలింగ్ తేది 22-11-89**



"ఇంద్రుడు-చంద్రుడు"లో కమలహాసన్, విజయశాంతి

# దాసరి మేనక-భానుప్రియ?

ఎన్. టి. ఆర్. "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చిత్రంలో మేనక పాత్ర ధరించే అవకాశంకోసం ఎందరో తారలు ఆశపడ్డారు. క్షత్రియ స్మరణ్ణ చేర్చిన భానుప్రియ తనకు తప్పకుండా ఆ పాత్ర దొరుకుతుందని ఆశించింది. కాని ఆమె నిరాశ చెందకుండా దాసరి టి. వి. సీరియల్‌లో ఆ పాత్ర దక్కించుకుంది. ఈ పాత్రకోసం దాసరివద్ద ప్రయత్నించిన తారలు కూడా లేకపోలేదు.

### "మహాత్ములారా మన్నిపుట్టండి"

ఎన్నికలముందు విడుదలవడానికి సిద్ధమవుతున్న చిత్రాలలో దాసరి "మహాత్ములారా మన్నిపుట్టండి" ఒకటి. దాసరే ప్రధాన పాత్రధారి. ఈ చిత్రం ద్వారా ఓ టు వే సి ప్రేక్షకులకు కొన్ని మెసేజ్‌లు తెలియజేస్తారట దాసరి. ఎప్పుడూ ఏదో ఒక సంచలనాత్మక వార్తను వెలువరించకుండా వుండలేడు దాసరి. ఈ చిత్రానికి ఆయన శ్రీమతి దాసరి పద్మ నిర్మాత.

**మద్రాసు సినిమా వార్తలు**

### నటీనటుల అస్తమయం

మద్యానికి లొంగి తెలుగుతెరకు దూరమైన సుప్రసిద్ధ హరనాథ్ నవంబర్ 1 తేది మధ్యాహ్నం 11.35 గంటలకు మద్రాసులో ఆయన స్వగృహంలో మృత్యువుకు లోనయ్యారు. వయసు 52. భార్య, కుమారుడు, కుమార్తె వున్నారు. "సీతారామకళ్యాణం, లేత మనసులు" వగైరా చిత్రాలలో నాయకుడుగా హరనాథ్ ప్రశంసలందుకున్నారు.

పొన్నలూరి బ్రదర్స్ వారి "శైలజ" నాయిక, నటి జయచిత్ర తల్లి జయశ్రీ (అమ్మాజీ) అక్టోబర్ 22 మధ్యాహ్నం హృద్రోగంతో మరణించారు. వయసు 55. జయచిత్రకాక ఆమెకు ఇద్దరు కొడుకులున్నారు.

### హైదరాబాదులో అవార్డులు

ఎవరైనా ప్రముఖతార హైదరాబాదులోని ఏ షూటింగ్ స్పాట్‌లో కనిపించినా ఒక పదిరేని పుల్లమ్మో, దానయ్యో ఆ తారను ఆపి పెట్టుకొని తిరుగుతూంటారన్నమాట. ఈ పుల్లమ్మలు, దానయ్యలపని ప్రముఖ నటీనటులకు సన్మానాలు చేయడం. ఒక్కొక్క

-తరువాయి 14వ పేజీలో

## స్వరాలూ లేవు - చట్టుబండలూ లేవు

# స్వరకల్పన

**చిత్ర సమీక్ష**
**గిద్దలూరు గోపాలరావు**

మృదువుగా, మధురంగా లేని సంగీతం నిరర్థకం. సంగీతానికి సరసమైన సరళిలో స్వరకల్పన రూపొందినప్పుడే రాగాలలో మధురసం రంజిల్లుతుంది.

అలాగే-

సుఖము, కాంతిలేని మానవజీవితం వ్యర్థం. జీవనరాగం లయంవిన్నప్పుడు కృతి పరిధిలో ఆ రాగసౌధంలో మానవునికి పరమానందం విరాజిల్లుతుంది.

చక్కని స్వరసృష్టికి పరిపూర్ణమైన సంగీత సాహిత్యసంపద అవసరమైనట్లు, మానవుని జీవనకృతిని సరిదిద్దేందుకు ఆత్మీయత, ఆప్యాయతలా అనుగుణంగా అమరిన మానవత కావాలి. ఈ రాగ మాధుర్యాన్ని భావింపచేసేందుకు వంశీ దర్శకత్వంలో తయారైన "స్వరకల్పన" చిత్రంలో కొంత ప్రయత్నం జరిగింది. కాని ఆ ప్రయత్నం అంతగా ఫలించలేదు. వంశీ దర్శకత్వంలోని తీరుతెన్నులు దారితప్పటమే దీనికి కారణం.

చిత్రం మొదటిభాగం కాస్త సరదాగా సాగుతుంది. రెండోభాగం కాంతేపం పరిధిదాటి ప్రేక్షకులను వేధించుకుతినే స్థాయికి దిగజారుతుంది. అసలువిషయం వదిలేసి చిల్లరమల్లర విషయాలమీద అనవసరమైన అల్లరి చేయబడింది. ఆత్మబంధువుల్లా మెలగుతూ, ఊరిపెద్దల్లా వ్యవహరిస్తున్న వరహాలరాజు (కోట శ్రీనివాసరావు) శంకరంమాస్టారు (సోమయాజులు) ఆత్మీయతను విస్మరించి ప్రతి చిన్నవిషయంలోనూ మనస్పర్థలు పెంచుకోవటం ముఖంమొత్తినట్టుగా వుంది. ఈ రెండు కుటుంబాల తుంటరితగాదాలు తల బద్దలుకొడ్తాయి; రోత అనిపిస్తాయి.

ఏడిద శ్రీరాం సినీ నటుడుగా కొత్త కాకపోయినా హీరోగా నటించటం ఇదే కొత్త. ఇతను ఈ చిత్రనిర్మాత ఏడిద నాగేశ్వరరావు కుమారుడు. ఇతని విగ్రహపుష్టి, సంభాషణం తీరు, భావ ప్రకటన అన్నీ బాగున్నాయి. ఇతనిలో బాగులేనిది ఒక్కటే కనిపిస్తుంది. అది, నటనలో రూపంలో హాస్యహీరో రాజేంద్రప్రసాద్‌లా కనిపించటం. అతన్ని అనుకరించటం. పాత హీరోలను అనుకరించకుండా తన దంటూ ఒక కొత్త బాణీని అలవరచుకుంటే ఏడిద శ్రీరాం మంచి హీరో కాగలడు. మిగతావారంతా పాతవారే.

ఈ చిత్రం పేరునుబట్టి ఇదొక సంగీతభరితమైన చిత్రమనుకోవద్దు. అమర్ అందించిన పాటల బాణీకు సంగీతంలో కాని, నేపథ్య సంగీతంలోకాని, ఎక్కువ కమ్మదనం ఆశించవద్దు. ఇందులోని పాటలు, డ్యాన్సులు కథ నడకకు అడ్డు తగిలి వాటి పట్నం గరువుకాకపోతాయి.

చిన్నవాడు తప్పిపోయిన కూతురు కోసం విలపించే మాతృహృదయంతో ఆరంభిస్తుంది కథ. ఈ కథ పల్లెవాతావరణంలో రెండు కుటుంబాల మధ్య తయారవుతాయి. సావిత్రి (సీత) అనే అమ్మాయి తన అన్న (రాళ్ళపల్లి) ప్రోత్సాహంతో తప్పిపోయిన కూతురుస్థానంలో విలపిస్తున్న మాతృహృదయాన్ని చేదుకుంటుంది. ఆ తల్లికి కూతురుగా నటించి ప్రతిఫలంగా తీగల సవరించి ఆ తల్లి జీవనసరళిలో స్వరకల్పన చేస్తుంది, అంతేకాకుండా ఆమెరక్త సంబంధాలకు నాస్తికత్వాన్ని పారద్రోలుతుంది. ఆ కుటుంబ ఆస్తిని అపహరించాలనుకునే సంటి (తనికెళ్ళభరణి) ఆటలు కట్టిస్తుంది.

ఇది సరేకాని. ఒకవైపు విశ్వనాథ్ నేనే మీ తప్పిపోయిన కూతురునంటూ ఇంట్లో ప్రవేశించిన సావిత్రి మాటనమ్మేసి వరహాలరాజు వగైరాలు ఆమెను తమ కూతురుగా అంగీకరించటం సబబుగా వుందా? ఇదీ సరే అనుకుంటే ఆదేమాదిరి వివాహంకాకుండానే గర్భవతియైన ఒక నడ్డివచ్చి నేనే మీకూతుర్ని అనటంతోటే ఆమె తన కూతురంటూ వరహాలరాజు అంగీకరించటం ఇదంతా ఏమైనా బాగుందా? ఇది ఏమికథ? ఇదేమి దర్శకత్వం?

వంశీ వ్రాసిన ఈ కథలో "ది సౌండ్ ఆఫ్ మ్యూజిక్" అనే ఆంగ్ల చిత్రంలోని ప్రేమానురాగాలు స్వరమాధురి ధ్వనిని చూచాయగా వినిపిస్తుంది.

పల్లెసీమలోని రమణీయమైన ప్రకృతి దృశ్యాలు ఈ చిత్రానికి వున్న ఒకేఒక సొగసు. ఈ సొగసు, సోయగాలు హరి అనుమోలు కెమెరాలో పరవశించిపోయాయి. ★

# 'విశ్వామిత్ర' కొన్నవారికి చేతిలో చిప్పలే గతా?

"ప్రధాని కావాలనే ఆరాటంతో జాతీయస్థాయిలో నేషనల్ ఫ్రంట్ పార్టీని పెట్టి అధ్యక్షుడై, 60 లక్షలు మాత్రమే ఖర్చుచేసి 'బ్రహ్మర్షి విశ్వామిత్ర' చిత్రాన్ని తీస్తూ, పంపిణీదారులనుండి కోట్ల రూపాయలు ఎన్. టి. రామారావు వసూలు చేసుకుని సొమ్ము గడించడం న్యాయమేనా" అని కాంగ్రెస్ పార్టీలో తెలుగునాడు పార్టీని విలీనం చేసిన తెలుగునాడు మాజీ అధ్యక్షుడు ముద్రగడ పద్మనాభం చెప్పిన విషయం సినీ వ్యాపారుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించాయి. 'విశ్వామిత్ర' చిత్రం ఎన్నికల సమయంలో విడుదలై కోట్లాది రూపాయలు తెచ్చిపెడుతుందని ఆశపడి జిల్లాలవారీగా కొనుగోలు చేసిన పంపిణీదారులు కుంగిపోతున్నారు. ఆ చిత్రాన్ని ఎన్నికల దృష్ట్యా ట్రైలర్ రూపంలో రాష్ట్రంలో అన్ని గ్రామాలలో ప్రదర్శించనున్నారన్న వార్త కొనుగోలుదారులను మరింత దెబ్బతీసింది. మరోవైపు దూరదర్శన్‌లో దాసరి 'విశ్వామిత్ర' వారంవారం ప్రసారమవడం అందర్నీ కృంగదీసింది. నెల్లూరుజిల్లాలో కల్యాణి ఫిలిమ్స్ ద్వారా విడుదల చేసేందుకు ప్రముఖ పారిశ్రామికవేత్తలైన మాగుంట సోదరులు 80 లక్షలకు కొనుగోలు చేసినట్లు చెప్పబడుతోంది. పల్లెటూరి రోడ్ల మీద 'ట్రైలర్‌గా' విశ్వామిత్ర ప్రదర్శింపబడకుండా హైకోర్టునుంచి స్టే తీసుకు రావడానికి కొందరు కొనుగోలుదారులు ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలుస్తోంది. ★

# ఈరోజు కాళ్ళుపట్టుకునేవారే - రేపు కాళ్ళక్రింద త్రొక్కుతారు'





## చాలు చాలు ఈ బేరం - ఇక సాగనివ్వం ఈ మోసం!

పదవీ వ్యామోహంతో
ప్రజ్వలించే అధికార దాహంతో
వూడిపోయిన పదవికోసం
గోడుగోడుమని విలపిస్తూ
కడవలకొద్దీ మొసలికన్నీరు కారుస్తూ
జాలిగొల్పే కథలు విన్పిస్తూ
గురువులపై దొంగభక్తిని వెల్లడిస్తూ
కాళ్లు పట్టుకుంటానని ప్రాధేయపడుతూ
ఓట్లకోసం మన ముందుకు
పయోముఖ విషకుంభాలు వస్తున్నాయి!
ఈరోజు కాళ్లు పట్టుకున్నవారే, రేపు
మనల్ని కాళ్ళక్రింద త్రొక్కిపారేస్తారు
ఈ కట్టుకథలు నమ్మడానికి మనం
లక్కబొమ్మలమా? వాజమ్మలమా?

**పాపన్న గెలుపు - పేదల బ్రతుకుల్లో మలుపు**

ఎంతకాలం ఈ దొంగనాటకాల బేరం?
ఎంతకాలం ఈ పట్టపగటి మోసం?
పదవికోసం పూటకొకపార్టీ మార్చే
రంకు రాజకీయ మోసగాళ్లను
వారు నిర్మించిన అవకాశవాద సౌధాలను
అవినీతిమయమైన భవనాలను
నిట్టనిలువునా పుట్టి కలువుదాం—
ఓట్ల చీపురుతో దుమ్ము దులువుదాం!
తిరిగి మన కోవూరు చెంత
తిరిగే వీలులేకుండా శాస్తి చేద్దాం-

**నిజాయితీ, నిర్భీతి, నిష్కళంక వర్తనుడు**

**కోవూరు తెలుగుదేశం అభ్యర్థి**

**బెజవాడ పాపిరెడ్డి**

**గారిని గెలిపించుకుందాం!**

**రారండీ, యావన్మందీ!**



**రామరాజ్యం స్థాపిద్దాం రండీ!**

(Space Donated by Kovur N T R Fans)

# ఎద్దుబండ్లకూ ఏడుపు తెప్పించే రోడ్లు, కన్నీళ్లకూ తడవని బీడుభూములు-
# ఎంతకాలమైనా ఉదయగిరి చీకటికోనగా వుండిపోవల్సిందేనా?



ఈ అనాదరణకు
అంతం పల్కేందుకు
ఈ ఎన్నికలే
ఆరంభం కావాలి!



తరతరాల పాలకుల దారుణ నిర్లక్ష్యానికి
బలైపోయిన నియోజకవర్గం-ఉదయగిరి
ఎన్ని ఎన్నికలు జరిగినా, ఎందరెందరు గెల్చినా
అభివృద్ధికి నోచుకోని చీకటికోన-ఉదయగిరి
రోడ్లుచూస్తే-ఎద్దుబండ్లకు ఏడ్పు తెప్పిస్తున్నాయి.
పొలాలుచూస్తే-నీళ్ళులేక బీడుపడిపోతున్నాయి.
ఇంతేదిచూసినా-అభివృద్ధిలో వెనుకడుగే

## ఉదయగిరి శాసనసభ నియోజకవర్గం
## కాంగ్రెస్ అభ్యర్థి

పేదప్రజల సమస్యలపట్ల
పరిపూర్ణమైన అవగాహన కలవాడు
ఇందిరమ్మ ఆశయాలను
అక్షరాలా అమలు చేయగలవాడు

# మాదాల జానకిరాం

నాగార్జునసాగర్ నీళ్ళు రాలేదు-
తెలుగుగంగ కాల్వ పారలేదు.
కాలేజీలు పెట్టలేదు-కార్యాలయాలుతెరపలేదు.
ఎంతకాలమైనా మనమిట్లా వుండిపోవలసిందేనా?
ఈ అనాభివృద్ధి ఎల్లకాలం కొనసాగడానికిలేదు!
ఈ ఎన్నికలతో అభివృద్ధికి నాంది పల్కుదాం,
అనాదరణకు అంతం పల్కుదాం,
మన అభివృద్ధికోరే అభ్యర్థులను గెల్పించుకుందాం!

## ఒంగోలు పార్లమెంటరీ నియోజకవర్గం
## కాంగ్రెస్ అభ్యర్థి

విద్యావంతుడు, ఉత్సాహవంతుడు. డిగ్రీకాలేజి ప్రదాత
ఉదయగిరి అభివృద్ధికి ఆరేళ్ళుగా అహరహం
కృషిచేస్తున్న ప్రజానేత

# ఎం. రాజమోహన్ రెడ్డి



చేతిగుర్తుకు ఓటివ్వండి-
చీకటి కోనల్లో చిరుదీపాలు
వెల్గించేందుకు చేయూతనివ్వండి

-ఉదయగిరి నియోజకవర్గం కాంగ్రెస్ కమిటి

